శ్రీరస్తు.

22

# రాసభవిలాసము.

ఇది,

బ్రహ్మపుర నివాసి

## గాదె శ్రీజగన్నాథస్వామి

ప్రణీతము.

---

మొదటి కూర్పు 500 ప్రతులు.

గీ. పాఠశాలలకుపయోగ • పడఁగ సులభ
శైలి నీతిబోధక మయి • గ్రాలునట్టి
రాసభవిలాస కోశమున్ • వ్రాసినాఁడు
గాదెకులజుండు శ్రీజగ•న్నాథ సుకవి.

ఇచ్ఛాపురము:

శ్రీ స్వేచ్ఛావతీ ముద్రాక్షరశాల.

1911.

వెల 2 అణాలు.

శ్రీ ...
మనకు బలభద్రపాత్రుని శ్రీరామకృష్ణ
కు ఇవ్వబడినది. ది 28/10/192

పీఠిక. B. Ramakrishnayya

---

ఈ చిన్నిపొత్తంబు మత్తిల్లి కొఱలు కూయు రాసభతుల్య చారిత్రులకు నుత్తలపాటును వారికాప్తులైనట్టి బాలిశాధములకు దుర్భరవిషాదంబునుం గల్పించుటయేకాక, దుర్వినీతులకు సన్మార్గ ప్రబోధకంబై దుర్మదాంధులకు గర్వోద్ఘాటనాంజనంబై గురునిందాభినందనులకు శల్యగతశరంబై పండితమ్మన్యులకు శృంగభంగంబై మఱియు విబుధ జనమనోరంజకంబై యాచంద్రతారార్కముగా నభివర్ధిల్లుంగాత!

దీనినుదారచిత్తులై విద్యాశాఖవారు పరిగ్రహించి పాఠశాలలకుం బెట్టించి కృతికర్తను హెచ్చరించి యేతత్ఫక్కి గ్రంథములు మఱికొన్ని రచింపఁ జేయించెదరను నమ్మకముతో వారికి నానమస్కృతులర్పించుచున్నాఁడను.

హ. గోపాలరావు,
ఉపాధ్యాయుఁడు.

తే. ఇట్టి కృతులెన్నియో కల ♦ వింగిలీషు
భాషలోఁగాని మనదేశ ♦ భాషలందుఁ
గాన మాలోపమును దీర్పఁ ♦ గడిగినాఁడఁ
దప్పులున్న సమ్మన్నించు ♦ టొప్పు మీకు
సరసమతులార విద్యా ప్ర ♦ చారులార.

తే. కృతిని రచియింపుమని హెచ్చ ♦ రించు హితుల
నర్థిఁ బీఠిక వ్రాసిన ♦ యాప్తవెండి
తగునభిప్రాయములిడు ను ♦ దారమతుల
నెంచి మద్గురువర్యుల ♦ నెలమిఁ గొల్తు.

25-6-1911.
బరంపురము.

బుధజనవిధేయుఁడు,
గాదె – శ్రీజగన్నాథస్వామి.

# Testimonials.

**P. S. Ramamoorty, B. A., L. T.**
*Camp* SANTAPETA, BERHAMPUR.
*Ganjam District.*

MADRĀS,
Bombay House.
**Triplicane.30-5-11**

*M. R. Ry* **Gade Sri Jagannadhaswamy**
**Pantulu Garu.**

*Sir,*

Many thanks for your kindness in asking me to go through your manuscript booklet 'Rasabha Vilasam.' I have done it with great pleasure, you have attempted and that, successfully at an easy and running style. The way in which you have drawn general inferences of truth from particulars (use of 'Arthantaranyasam') is really admirable. This is how the book is made to embody very important morals; especialy that of obedience to one's teacher or guru. In these days when boys are generally accused of disobedience to their masters and elders your booklet is of peculiar importance as tending to stimulate this all essential quality of obeying them.

I believe that your attempt will be highly appreciated by the public in general and by the educational department in particular. I am of opinion that it may with great advantage be introduced as a TEXT-BOOK in our High School classes.

Wishing you all success.

*I am,*
*Sir,*
*Ever Yours Sincerely,*
P. S. Ramamoorty.
*1st Assistant Teacher.*
Madras.

అయ్యా!

మీరు వ్రాసిన 'రాసభ విలాసము' నేనును, నా మిత్రులునుగాంచి యమితానందము నందితిమి. ఉపమార్ధాంతరన్యాసములు విచ్చలవిడిగాఁ జొన్పి కొన్ని నీతుల బోధపఱచినారు. అందు గురుదూషణ శిష్యులకుఁ దగదను నీతి సరసముగాఁ గఱుపుట వలనను, శైలి సులభముగా నుండుటవలనను బాఠశాలలకుఁ బోవు విద్యార్థులకు నుపచరించునని నా నమ్మకము. ఇట్టి పుస్తకము లాంగ్లేయ భాషలోనున్నవి. కాని మనభాషలోఁ దఱుచుగాఁ గాన్పింపవు. కావున నీపుస్తకము ఆంధ్ర భాషాభిమానులెల్లరు నాదరించుట యుక్తమని నాయెన్నిక.

30-5-11.
బరంపురము.

ఇట్లు
తాపీ-ధర్మారావు, బి. ఏ.
కల్లికోట కాలేజి యుపాధ్యాయుఁడు.

అయ్యా!

మీపుస్తకము చూచి యానందించితిని. పంచతంత్రములోని కథవలె మీ రాసభకథయుఁ జమత్కారముగా రచింపఁ బడినదనియు శైలి సరసముగా నున్నదనియుఁ జెప్పఁగలను. ఈపుస్తకము స్కూలు బాలుర కుపయోగించిన లాభ ముండునని నా నమ్మకము.

5-6-11.
ఛత్రపురము.

మంగు-శ్రీనివాసరావు, బి. ఏ.

ఆర్యా!

ఇవ్వాత్తంబున 31 పద్యంబునఁ "గర్ణపర్వముగాగ" ననియును 63వ పద్యంబున "సుయోధను కథమె నిదర్శనంబ" నియును జేర్కొనుటం జేసి నాకుం జూడ శ్రీమహాభారతాంతర్గత కర్ణపర్వమునం గల 'హంస కాకీయోపాఖ్యానము' దలపునకు వచ్చుచున్నయది. ఇంచు మించుగా నిక్కథను 'హయము హంసము' గాను 'ఖరము కాకము' గాను బోల్పఁదగును. గురునింద గర్హితంబనునీతిఁదెల్పు తావకకృతి విబుధ జనానందకరంబై కరంబుగ్రాలుం గాత!

15-6-11.
ఇచ్ఛాపురము.

శంబరాతు-జగన్నాయకులుఁడు.
ఎస్. ఎస్. స్కూలు తెలుఁగు పండితుఁడు.

సుధీనిధీ!

భవద్విరచితంబగు "రాసభోపాఖ్యానంబు" సాంతంబుగఁ జూచి య మందానందంబునొంది పద్యంబొండు పనిపితి.

ఇట్టి కల్పనాకథానకంబులు గల వేనవేల గ్రంథంబులఁ దమచే రచియింపఁ జేసి తస్మూలమున లోకములోని దుర్బుద్ధులగు దేవానాంప్రియుల కునామ్రవంబు డిండింపఁ జేయు గాతయని శ్రీయః పతిని వేఁడుచున్నాఁడను.

శా. విఖ్యాతోన్నత నూత్నకల్పనకథా • విజ్ఞాన సందర్భ సా
ముఖ్య ప్రాభృత శబ్దయుగ్విలసిత • పోర్షిక్యంబు నీ రాసభో
పాఖ్యానంబును గాంచి కాకవులు గ•ర్వంబెల్ల మాలంగ వే
సఖ్యంబున్ బొనరింత్రు సత్కవుల ద•చ్ఛాత్రత్వము స్థాపుచున్.

24-6-11.
బస్తాపురము.

ఇట్లు కవిజనహితుఁడు
లింగము - తమ్మయ్య.

---

## శుద్ధపత్రిక.

| పద్యసంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 9 | బుట్రైగాలిగాఁడు | బుట్టుగాలిగాఁడు |
| 13 | సాకీన్ | సాక్కిన్ |
| 16 | బెహారి | బేహారి |
| 22 | పోనీ జాతి | పోనిజాతి |
| 31 | జడులకుఁ | జడులకును |
| 45 | వేబాసి | వేపాసి |
| 49 | బెట్టినవంత | బెట్టినయంత |
| " | గూతులు | గూతలు |

11, 20 22 28, 29, 44 పద్యములలోఁగల 'వాని' యను సర్వనామమునకు 'దాని' యని చదువుకొనవలయును.

శ్రీరస్తు.

# రాసభవిలాసము.

## ఏకాశ్వాసము.

చ. సరసవచోవిశారదులు • సంస్కృతసాహితిసార్వభౌములౌ
నిరుపమమేధగల్గిన మ • నీషులె జంకుచు దిట్టిపట్లఁగే
సరివెలితోలు కప్పుకొని • వచ్చినరాసభ మట్టులౌర! మీ
గరయక లక్ష్యలక్షణము • లష్టవధానము సల్పఁ జెల్లునే?

సీ. తగినంతపాండిత్య • ధనము లేకుండి యే
సభ కెక్కువాఁడె రా • సభము చూడ
శ్రుతిశాస్త్రవాసన • స్ఫూర్తి లేకుండి యే
సభ కెక్కువాఁడె రా • సభము చూడ
చకచక భాషింప • శక్తి లేకుండి యే
సభ కెక్కువాఁడె రా • సభము చూడ
ప్రస్తుతలోకాను • భవము లేకుండి యే
సభ కెక్కువాఁడె రా • సభము చూడ

తే. వెడ్డెబుద్ధియుఁ జెప్పెడి • పెద్దవారిఁ
జాల నిరసించువాఁడె రా • సభము చూడ
తప్పుతడకలతోడ గ్రం • థములు వ్రాయ
సాహసించెడివాఁడె రా • సభము చూడ
బాలమతులార! చిరకీర్తి • లోలులార!

క. తల బిరుసుతనము మిక్కిలి
గలతనశిష్యులకు బోధ • గావింపఁగ వా

నల రావించియు; నొకగురుఁ
డెలమిని బై పద్యయుగము • నేర్పడఁ జదివెన్. 3

తే. వారిలో నొక్కఁగడసరి • పఠిమపద్య
భావమును మాకు నెఱిఁగింప • వే వదాన్య!
యని యడుగ నాయుపాధ్యాయుఁ • డల్లన నగి
యెల్లశిష్యులు వినఁగఁ దా • నిట్టు లనియె. 4

తే. వత్స! చూడ నీ పీపద్య • భావ మెఱుఁగ
వలెన నావు నచ్చెరువయ్యె • నైన వినుము
రాసభవిలాస మను నొక్క • రమ్యగాథ
గలదు దానఁ దద్భావంబు • తెలియఁదగును. 5

## కథాప్రారంభము.

ఉ. కల దొకదొడ్డపట్టణము • గాఢజనాంతమునందు; నాపురిన్
మెలఁగెడుఁ బెక్కుగాడిదలు; • మేయుచు నయ్యవి రేఁబవళ్ళు వా
డలఁ దిరిగాడుచుండు నొక • టంబుగఁ గూయుచు వింతవింత క్రీ
డలఁ బచరించుచుండుఁ గడు • డంబుగఁ జూపఱు లెల్ల నవ్వగన్. 6

క. ఆమృగముల వాగ్ధోరణి
కామృగముల కృతులకాత్మ • నలరుచు వేడ్కన్
బామరులును సోమరులుం
బామసులై కాలయాప • న మొనర్తు రిదా. 7

తే. శాఖికాభేదమునె కాక • జాతిభేద
మును గణింపక మెలఁగు నా • ప్రోలిగాలి
గాఁడ్దెలో నొక్కటియు రెండుఁ • గాక పెక్కు
తెగలు వర్ధిల్లుచుండు నా • తెగలయందు. 8

క. గాడిదకు నల్లకంచరి
గాడిదకును బుట్టెడాలి • గాఁ డొక్కఁడు తాఁ
గూడి యొక మేలు తేజిని
వేసరి కొను జెప్పుచుంచు • నిద్దఱు తనకున్. 9

ఉ. గాడిదపిల్లకోమలము • గాంచి స్వజాతిదిగా భ్రమించి తత్
వేడినవిద్దె లెల్లఁ గడు • వేడుకతోడుత నాహయంబు నా
గ్రేడులు దాక నేర్పుచు • నీడును మీఱినవెన్క వానిఁ దా
గాడిదపట్టిగా నెఱిఁగి • క్రన్ననఁ దోలఁగఁ జూచి యిట్లనున్. 10

తే. బాలరాసభమా! నీవు • గాలిగాండ్రి
యందు నధికుండ వై యుందు • వస్మదీయ
కృపకుఁ బాత్రుండ వై యుంటి • నింక వెడలు
మంచు దీవించి వానిఁ బు • త్తెంచె వెసను. 11

తే. అంత ఖరబాలకము విడి • యశ్వగాసని
స్వేచ్ఛఁ జరియించుచుండె వీ • క్షించి కక్షఁ
దైనయొక దాబుగాఁడను • నట్టిచాకి
దానిఁ దరిఁజేర్చి పెంచె నా • దరము మీఱ. 12

క. బట్టల మూటలతోడను
గట్టెలమోపులను మోయఁ • గాఁ జేయుచు నా
దిట్ట యగుగాలిగానిని
గొట్టక తిట్టక యా చాకి • గూర్మిన్ సాకెన్. 13

తే. కూడు లేక త్తవాంఁటుఁ • గొన్ని నాళ్లు
గాలిగానితో నాడాబు • గాఁడు నుండి
యెలమి నత్తితోఁ గృష్ణలీ • లలను సలుపఁ
జొచ్చె మామకీసంగతి • సొరిదిఁ దెలిసె. 14

తే. వెంటనే యాతఁ డల్లుని • నింటినుండి
వెడలఁ గొట్టింప వాఁ డొక్క • వీటి కేగి
పిదపఁ దనగాలిగానిఁ దె • ప్పించుకొనియు
నచటఁ గొన్నాళ్లు వసియించు • నవసరమున. 15

ఉ. అచ్చటి పెద్దబేహారిధ • నాఢ్యుఁడు సుంకరి లచ్చిగానితో
హెచ్చుగఁ జాకి మైత్రి ఘటి • యించి ఖరంబును బెంచలేక దా
నిచ్చెను 'బెగ్గపోని' యని • యెంతయు బొంకుచు లచ్చిగానికిన్
ముచ్చటగాఁగఁ గొన్నిదిన • ములన్ భరియించెను వాఁడు భ్రాంతుఁడై. 16

తే. ఖురములకు నాళ్లు దగిలించి • సరసమైన
జీను మూపున వేయించి • చిత్రపటము
నెమ్మిఁ దీయించి ఖరము తా • నమ్మఁజూపెఁ
బెద్దబేహారి యెంతటి • చేల యొకో! 17

ఆ. పూర్వజనన సుకృత • మూలంబునను ధూర్త
గార్దభమున కిట్టి • ఘనతరాఁగ
దాన నద్ది మఱచెఁ • దనజన్మకథ నౌర!
కలిమి యెంతమఱుపు • గలుగఁ జేయు. 18

ఆ. ఎన్న డాబుగాని • యింట నుండినదాని
కంటె లచ్చిగాని • యింటనున్న
తరిని మంచితిండి • దొరకిన కతమునఁ
గాయ మెట్లుఁ బెంచె • గాలిగాఁడు! 1[illegible]

క. తెగబలసి యింట నయ్యది
తెగనీల్గుచు వాడ వాడఁ • దిరుగుచు నటఁ దా
నగపడిన యెల్లమృగముల
మగటిమి గలవానివోలె • మాకొ(?)నుచు మడిఁ. 2

సీ. ఒకమాఱు సకలింప • నుంకించి యశ్వంబు
తనపాటి కాదని • తలచి యలరు
నొకసారి ఫీ పెట్ట • నుంకించి ద్విరదంబు
తనసాటి కాదని • తలచి చెలఁగు
నొకతూరి గాండ్రింప • నుంకించి వ్యాఘ్రంబు
తనకీడుకాదని • తలచి పొంగు
నొకపరిగర్జింప • నుంకించి సింహంబు
తన కెన కాదని • తలచియుబ్బు

తే. నిట్లె ఘనసత్వముల నెల్ల • నీసడించి
యధికగర్విష్ఠమై పట్న • మందుఁ దిరుగు
హరులఁ గయ్యంబునకుఁబిల్చు • నౌర గాలి
గాని కెంతచేసెను లచ్చి • గాని ప్రోడ!

శా. పోనీ జాతితురంగ మంచు మమతన్ • బోషించు చట్లొక్కడున్
వానిన్ బేహారి తా నెఱింగి ఖరసం • తానంబుగా వెంటనే
న్యూనత్వంబున కోర్వలేక మృగమున్ • నాకెంపఁగాఁ జూచియున్
మానున్ జాకలివేఁడుకోలుననుఁగా • న్నాళ్లట్లుపేక్షించుచున్. 22

ఉ. “ చాకలి లచ్చు బేహారికి • సంగడికాఁడటఁ వాఁడు సాఁకఁగా
లేక యొసంగుగాడిద బ • లే! తనవాహన మంటు ”యం చిటుల్
లోకులు చెప్పుకొంచుఁ దను • లోకువఁ జేయుఁడు నెట్టకేలకున్
గాకును జెంది వీడె నల • గార్దభమున్ విమలాంతరంగుఁడై. 23

ఉ. సుంకరి లచ్చిగాఁ డటుల • సొమ్ములతోఁ దను వీడనాడఁగా
సంకరరాసభంబు వెసఁ • జాకలి చెంతకుఁ జేర నంత ని
శ్శంకతఁ దానిఁ గొంచుఁ దన • చానను నత్తను జూడఁ గోరి యా
రంభుఁడు తొంటివీటికిని • గ్రమ్మఱఁ జేరెను వెండి యత్తఱిన్. 24

తే. మామగా రత్తమాయలం • బడి తొలుతటి
ద్వేషమును వీడి యాతనిన్ • బేర్మి నింట
నుంచుకొనె నెప్పటివలె వాఁ • డుండ సాగె
నిల్లటిక ముంచుకొన నానె? • యల్లువాని. 25

ఉ. ముందటిపోలె గార్దభము • మూటలు మోయఁగ నీక వాజిగా
నెందును జూచుకొంచు భరి • యించెను జాకలి కొన్ని నాళ్లొగిన్
మందుఁ డొకండు దానివెల • మానుగ నిచ్చియు నంచి బండికిన్
బొందుగఁ గట్టుచుండు నది • మొట్టొకసారి యని లాగఁ దీనతన్. 26

క. కుటిలఖర మొక్కదినమున
జటకాశకటంబు నీడ్వఁ • జాలక దానిన్
బటుతరశిలకుఁ దగిల్చినఁ
జెటాలున బండి విఱిగి • చెడుటయు వాఁడున్. 27

తే. బండికిని గట్టుటకుఁ జూడఁ • బనికి రాద
టంచు నామృగంబును వీడ • నదియు డాబు
గానియిలు సేరుకొనె వాఁడు • వానివల్ల
దుర్జనశ్రేష్ఠి కమ్మె నా • దుర్జనుండు. 28

తే. ఆటఁ గుఱ్ఱంబు కైవడి • నాడ నేర్చు
బందెపుంగట్టు వట్టుల • పాఱ నేర్చు
నంచుఁ జాకి చెప్పినమాట • లాలకించి
మంచిమేఁత వానికిని బె • ట్టించుచుండు. 2

ఉ. తీరికయున్న వేళలను • దేవళదీయుచుఁ గూనిరాగముల్
వారకవీధులన్ దిరుగుఁ • బౌరుల మెప్పును బొందఁగోరి, యె
వ్వారికి నిట్లు తోఁచఁగద • వాని ప్రవర్తన యుక్తమంచు ని
ఘాయణిలేనిచోఁ ఖరము • దానిటు గూయుచు సంతసించునే. 3

క. వేడుకగ బొక్కిడబ్బా
గాడిదతోఁ కకును గొంటి • గాండ్రిగఁ గట్టన్
మోడిగనది తిరుగాడును
వాడలజనులకుఁ గర్ణ • పర్వముగాగన్. ౪

క. ఉసూసెడి గాడిదమందన్
మేసెడి గాడిదలనెల్ల • మిడుకఁగఁ జెఱచున్;
నాసామెత సార్థకపడ
రాసభబాలకుల నెల్ల • రఁజెఱపఁదొడఁగెన్ ౫

తే. మఱియుఁ దొల్లింటికంటె నా • మొఱకు మెకము
పోత్తరించియు గోవిందు • పురము చెంత
మెలఁగు నొక పెద్ద గాడిదన్ • వలచె నౌర!
మృగములకు నీతివర్తన • మెట్టులబ్బు? ౬

క. తను గన్న వారియిష్టము
గొన కుండిన మానెఁ గాని • కూడఁగ నగునే?
తనకంటెఁ బెద్దదానిని
గనుగొను నే వయసువారి • కామాంధుఁ డిలన్. ౭

క. ఈసంగతి దా నెట్లో
కాసంత యెఱింగి ఘోట • కము శిష్యుని నా
రాసభముఁ బిల్చి యది కడు
దోసం బని చెప్పెఁ బాల • మూరం బవయున్. ౮

కం. నా కితఁడు సెప్పవాఁడా
నాకంటెను విద్యలందు • ఘనుఁడా యౌం
గాకేసరి గురుమూషణ
పాణ్ణికటముగఁ జేయ జొచ్చె • ఫణపతికిన్నేఁ. 36

గీ. వృథగఁ దను నిందచేయు నా • మృగమూకపకు
నాయమాయక ఘోటకే • మంత సొక్క
నాకు చని యోరి! గురుడైన • నన్ను మాఱు
చుంటి వని యింటి నీ కది • యొప్పునొక్కొ. 37

చ. గురుఁ డెటువంటి వాఁడయినఁ • గూడదు దూషణచేయ దానిచే
దొరగు యశంబు పుణ్యమని • తొల్లిటి పెద్దలు సెప్ప విందు నీ
తరణిఁ జరింపఁ జూచెదవె! • కల్గెదు లాభ మదేమొ నీవు లో
నరయుము! నాశ మందవటె • యల్పవచస్కుఁడ వైన బాలకా. 38

క. నావిని రోసము తోఁ నది
నీవా నాగురువు నాకు • నెఱి నైజముగా
యావద్విద్యలు వచ్చెను
నీవాచాలత్వ మింక • నెఱపకు మయ్యా. 39

ఉ. ఎంకి నేరు దేశికులొ • యేర్పడఁగాఁ దెలియంగవచ్చు వి
ద్యారసికుండు మాయొడయుఁ • డాతనివద్దకు వచ్చి తేనియున్
దీరును నీవివాద మని • దిట్టరియై వచియించి గాలిగాఁ
డారసికాగ్ర్యసన్నిధికి • నశ్వముఁ దోడ్కొనిపోయి యిట్లనున్. 40

తే. వింటివే! తాను గురుఁడంట • విద్య లెల్ల
నితనివద్ద నేర్చితి నంట • నింతకంటెఁ
గలదె! విపరీత మెందైన • ఖ్యాతికొఱకుఁ
జెప్పుకొన్నలోకులు విశ్వ • సింత్రె! స్వామి. 41

క. నాతోఁ గదమును వేయుచుఁ
జాతురి నై పరుగులెత్తు • శక్తియుఁ గలదే
నీతఁడని జూపె విమ్మట
నేతీరున నైనఁ జెప్పు • నీ యని మఱియున్. 42

తే. లచ్చిగానింటఁ దనకును • హాయిగాను
జరుగుచున్నాన మెల్ల నే • కరవుపెట్టె
చెనటిఖర మాత్మసంస్తుతుల్ • చేసికొనుచుఁ
జాలవఱ కశ్వగురునింద • సలుపఁ జొచ్చె.

క. ఖరముదొర ఖరముకూతలు
పరిపాటిగ నచ్చి వానిఁ • బ్రస్తుతిచేసెన్
విగసులకడ కేగిన బుధ
వరులకు ఘటియింప కున్నె? • పరిభవ మెట్లున్.

మ. అవమానం బటు చెంది ఘోటకము తా • నచ్చోటు వేబాసియిం
త విచారింపక చేర్చినందులకు వి • ద్యల్ నేర్చి యీగాలిగాఁ
డవనీతుం డయి యెంత చేసెఁ గదరా! • యంచున్ గడున్ ఖేద మం
ది విశేషించియుఁ దన్నుదా ననుకొనున్ • దీనత్వ మేపారఁగన్.

ఉ. ఈడును జోడు కా దనుచు • నీగతిఁ గొన్ని దినాలు పుచ్చి తా
నోడినవానివోలె గురు • వూరక యుండఁగ నంత కంతకున్
గాడిద కన్నుగానకయె • కాఱులు కూయుఁడు; నోర్వ లేక యా
గాడిద పేరు మాప హరి • కంకణమున్ ధరియించెఁ గ్రుద్ధుఁడై.

క. పగఱ తెగనీల్గి మాటికి
జగడించుచు నున్నతఱిని • సహనము పేరన్
దగ దది యూరక యుంటన్
మగటిమి నిజముగఁ గలట్టి • మానధనులకున్.

క. అని హయ మీరీతిని జిం
తన గావించి ఖరశిష్యు • దగ్గఱికిని దా
జని నీవెడకూతలు మా
నిన సరె లే కున్న నింక • నీపాగ రణఁతున్.

ఉ. ఎట్టెటొ నాల్గుపాదములు • నేర్పడఁ బెట్టిన నంతమాత్ర నే
మిట్టిపడంగ నేల నిను • మించెడి యుత్తము లెంద ఱేని యీ
పట్టణ మందు నున్నం గలరు • వారలతోఁ గలహింప నేల! నీ
గుట్టును మట్టుపెట్టఁ జేకుఁ • గూతలు కోతలు మాను దుర్మతీ.

క. నీవలెనె రెండు పిల్లులు
కావరమునఁ బెద్దపులుల • కంటెను దామే
భావింపఁగ శూరులమని
వావిరిఁ జెప్పుకొని శృంగ • భంగముఁ జెందెన్. 50

క. నాకడకు నీవు రావో
నాకడవిద్యలను నేర్చి • నావో లేదో
లోకు లెఱుంగుదు రేటికి
నీకాట్లాట నడువీధి • నిజముగ నటరా. 51

తే. తల్లికిం బట్టురా వసం • తంబు నాగ
గురుని నను ధిక్కరింతువు • కూళబుద్ధి!
నాడు కొట్టినదాబులు • నేడు నూపు
లేనిచోఁ బొమ్మ పురివీడి • కాన కింక. 52

తే. అనుఁడు నీ కేమి చెప్పితి • వయ్య నాకు!
గదము వేసినవేళలఁ • గల్గుదోష
ములను గొన్నింటి దిద్దితి • తెలియ నింత
మాత్ర గురు వౌదు వే? సాధు • ఛాత్రదూర! 53

తే. కదములలో లోట్లు తీర్చుటే • కాదు నీదు
కృతులఁ గల్గినలోపంబు • లెన్ని యేని
చూపి దిద్దితి నింకను • జూపగలను;
అనృత మాడకు మోరి నీ • యాయు వడఁగు. 54

క. ఈరీతి ఖరముఁ దేజియుఁ
బోరాడుటఁ జూచి వానిఁ • బోరున్ మాన్పన్,
దారిని జను నొకతగువరి
యారయఁ దా నిట్టు లనియె • నామృగములతోన్. 55

గీ. మీర లీగతి నూఱక • పోర నేల
చెప్పెద నొకయుపాయంబు • చిత్తగింపుఁ
డిరువురుఁ గలసి యొకగంట • పరుగులెత్తుఁ
డేరు దూరంబు పోదురో • వారె ఘనులు. 56

క. అని యతఁడు చెప్పఁదానికి
ఘనమున ముద మంది యవ్వి • మనలోపల నో
డినవా రటవికిఁ బోవలె
నని పందెము లొడ్డుకొంచు • నతి రభసమునన్. 57

గీ. పరుగిడఁగఁజొచ్చె నందులో • ఖరము పావు
గంటదనుక నాకేసరి • వెంట నంటి
పోఁగలిగెఁ గాని పిమ్మటఁ • బోవ లేక
వెనుకఁ బడి యెల్లరును జూడ • వీగె నంత. 58

చ. అరయఁగ రాసభంబునకు • నన్వయదోషము గల్గి యుంటఁద
చ్చరణము లెట్లు వంకరయి • చక్కఁగ నుండవు నడ్చునప్పుడే
పొరిఁబొరిఁ దొట్రుపాటుపడుఁ • బో యిక వేఱుగఁ జెప్ప నేటికిన్
బరుగిడువేళ నాపెకము • పాటులు చూచియుఁ దీఱగావలెన్. 59

క. తలఁ ద్రిప్పుకొంచుఁ గన్నుల
బలే యెగురవేసికొంచు • వాసిగఁ బురివా
డలఁ గూయుచు మెలఁగుఁడు నా
ఖలఖరమును నెల్లవారుఁ • గడుఁ దిట్టు చోగెన్. 60

క. గెలిచినకేసరి మెడలో
పల మేల్పూదండ నొండు • వైచియు దానిన్
బెలుచఁగఁ బొగడుచుఁ బురి వీ
థులఁ ద్రిప్పిరి ధూర్తమృగము • దుఃఖింపంగన్. 61

తే. పందెమును వేసికొనుగతి • వనికిఁ బోక
ప్రోల నిల్చిన తుంటరి • గాలిగానిఁ
గరుణ విడనాడి పౌరులు • తరిమి రకట
దొరయ కుండునె? గుణవిరో • ధులకుఁ జేటు. 62

తే. అట్లు యడవులపా లయ్యె • నాఖరంబు
పూర్తిగా గోటు విడ దయ్యెఁ • బుట్టెఁ బుట్టు
బుద్ధి పుల్లలతోఁ గాక • పోవు నెట్లు!
ధం సుబోధకథస్సై ని • దర్శనంబు. 63

క. వనసత్వభీతిసంగతి
ననయము దిగు లందుచుండి • యది యటుకొన్నా
ళ్లును జలుపుటయును నొకదిన
మున దైవగతి మృతసింహ • మును బొడఁగాంచెన్. 64

గీ. కాంచి తత్కళేబరముఁ లో • నెంచె నిట్లు
దీనిఁ దొడుగుకొనిన నిటఁ • దిరుగు నాకు
నడవిమృగములవలనిభ • యంబు దొరఁగు
నంచు నటు లాస్థ నది దాల్చి • కొంచుఁ జెలఁగు. 65

చ. నిజమగుసింగ మంచు నది • నెమ్మది నమ్మ మ నన్యజంతువుల్
గజగజలాడుచా ఖరము • గన్నచో దవ్వుదవ్వునుండి యే
వృజినపుభీతిఁ జావుపడు • గత్తుమనుంటను జూచి యొక్క నాఁ
వృజనమృగంబు పొంగి కడు • నేపు వహించియుఁ దొంటిసింహుఁడ్కాపాస్. 66

క. మదిమది నుండఁగ నేరక
యెదిరింపక పోలుమేటి • మృగములనైనన్
బెదిరించు చుండెనూతన
పదవీవైభవము నమ్మి • బాలకులారా? 67

చ. అటువలెఁ గొన్నినాళ్లుఁ జన • నంతట నొక్కదినంబునందు న
య్యటవిపథంబుఁ బట్టి యల • యశ్వము పోవఁ దటస్థ మాటయున్
గుటిలఖరంబు దాని గని • గొబ్బునఁ బైఁబడి హుంకరించినం
తట హరి పాఱఁజూచియును • దా ఖరరావము వించు నాగుమెన్. 68

క. కేసరి యిదియని యెంచితిఁ
గేసరియే యైన నిట్టి • కేకలిడునె? మా
రాసభమే యీశుహనా
కేసరి కానోపునంచుఁ • గేసరి తనలోన్. 69

తే. తలచి ధైర్యంబు చేపట్టి • నిలచి యదియుఁ
బాఱఁజూచిన ఖర మంతఁ • బాఱఁజూచెఁ
బాడుగాడిద గుట్టెల్లు • బయటఁబడఁగ
నవ్వుకొంచును దనదారి • నడచె హరియు. 70

తే. దూరమున నుండి యీసమా • చార మెల్ల
నరసి యొకజంబుకము తన • యాత్మబంధు
వితతి సమకూర్చుకొని వచ్చి • పెంకె ఖరముఁ
బట్టుకొనిపోయి తమవ్యాఘ్రి • పతికడ కొగి.

క. ఓసామి! వీఁడు గాడిద
కేసరివేషమ్ము దాల్చి • కిసరించె మిమున్
మీ సెల వైనను మే మిదె
గాసిలిపడఁ జేసి వీనిఁ • గడఁదేర్తు మనన్.

తే. అట్లు జరిగించుచే తన • కభిమత మని
తెలిపి పులి గాడిదచెలితో • లోలవఁ జేసి
వెనుక వీపుచర్మము వొలి • పించె నట
మోసగాఁ డిలనశియించి • పోవ కున్నె?

క. చేసినయప్పుడు నవ్వుముఁ
జేసెదరే కాని ఫలము చెందినవేళన్
గాసిలిపడి కుందుదు రని
రాసభకథ మనకుఁ దెల్పు • రహీనోబాలుల్.

క. దొరగు గురుమూషణొఘము
దొరగును వ్యభిచారముఖ్య • దోషము లెల్లన్
స్థిరమతితో నీరాసభ
చరితము పఠియించునట్టి • చదువరుల కిలన్.

క. ధర శాలివాహశకమునఁ
గరపురకరిచంద్రసంఖ్య • గడిచిన పిదపన్
[illegible]
న రచనసేసె నిది వ్రాసి • నాదను బేర్మిన్.

